# శ్రీ మన్నిశ్శంక చరిత్రము.






నేమాన సూర్యప్రకాశము.

# ఉపోద్ఘాతము.

చరిత్రాత్మకములగు గ్రంథములను రచియించుటయందు నాకిదియె ప్రథమ ప్రయత్నమయ్యెను, శ్రీమన్నిశ్శంక మహీపాలుర సచ్చరిత్రమును వ్రాయఁదగిన సామర్థ్యములేని వాఁడనయ్యును, నా కమ్మానవేంద్రులయెడఁ గల భక్తివిశ్వాసములనుఁ బట్టియు, మనయాంధ్ర భాషాయోషామణియొక్క సేవయందుఁగల యాసక్తినిఁ బట్టియు, నే నీపవిత్రచరిత్రమును పద్యరూపముగ రచియింప సాహసించినాఁడను. ఏలయన, విశాఖపట్టణ మండలాంతర్గతముగు శ్రీ మత్సంగివలస సంస్థానమున కధినాథులును, సకల జనసంస్తవనీయ మహామహిమాన్వితులును, నగు నిశ్శంకాధిపులు మాకుఁ గుల ప్రభువులు. మాకును నిశ్శంకవంశస్థులకును చిరకాలమునుండియుఁ బోష్యపోషక సంబంధముగలిగియుండుటయె కాక, ప్రస్తుతము రాజ్యపాలనము గావించుచున్న సాహెబ్ మెహర్బాన్, దోస్తాన్, శ్రీరాజా విశ్వేశ్వర నిశ్శంక బహద్దరు జమీందారు వారు తమ సంస్థానమునందు నాకు నుద్యోగముగూడ నొసఁగి యత్యంతాదరంబుతో గౌరవించుచుండిరి. ఇంతియె కాదు. వీరిపూర్వులవలనను, వీరివలనను, మాపూర్వులును నేనును బొందియున్న సత్కారము లసంఖ్యాకములనుట యావంతయు నతిశయోక్తి కాదు. ఇట్టి నిశ్శంక నృపాలుర విషయమై భక్తివిశ్వాససూచకముగను, సకలజన సమ్మతముగను, నేనొనర్పఁదగినకార్యమెద్ది? మఱియు వీరియెడఁ గృతఘ్నుఁడను గాకుండ మనఁదగు మార్గమెయ్యది? వెండియు నీ ప్రభుఋణమునంతయుఁ గాకున్నఁ గొంతయైనఁ దీర్చికొనుటకు నుపాయం బెద్ది? యని నే నాలోచించుచున్న సమయంబున నాకుఁ బ్రత్యక్షదైవస్వరూపయు, శాంత్యాది సకల సద్గుణరాశియు, నగు నా జనకుండు రామమూర్తిశర్మ, నా తలంపెఱింగి నన్నుఁ జేరఁజీరి, "కుమారా! నీ యభిప్రాయమతి సమంజసమైనది. శ్రీ నిశ్శంక నృపాలురయెడ నవ్యాజభక్తివిశ్వాసయుతముగు కృతజ్ఞతఁ జూపుట మనకుఁ గర్తవ్యము. మన మశక్తులగుటచే వేఱొండు విధంబున నద్దానిం జూపఁ జాలము. ఒకవేళ చూపిన నది శాశ్వతమైనదిగ నుండునని తలంప వలనుపడదు. కావున, గీ. సప్తసంతానములలోనఁ బ్రశస్తిఁ గాంచి ఖిలము గాకుండునది ధాత్రిఁ గృతియె' అను పెద్దనార్యుని సూక్తి ననుసరించి, యద్ధరిత్రీపతుల పవిత్రచరిత్రమును, విచిత్రతరానల్పకల్పనా విశేషంబు లెసఁగ మృదుమధురవచనరచన లలర, గద్యపద్యాత్మకంబగు నొక గ్రంథముగ రచి

సీ. సచివాదికోద్యోగి • విషయంబు సద్రాజ్య,విషయంబులెల్లను • విన్నవింపఁ
బండితాళి నిజ • ప్రతిభ చెన్నలరారఁ, బహుశాస్త్రగతుల ను•పన్యసింప
సత్కవుల్వసుధా•సారకల్పానల్ప, సరసపద్యంబుల • సరవిఁ జదువఁ
బౌరాణిక శ్రేణి • పరమవిచిత్రరీతి, హాసావళుల నెల్ల • హాళిదెలుప
నిందుచందురుఁబోలిన యిమ్మొగమున, నగవు వెన్నెలలిగురొత్త •నలినదళ వి
శాలనేత్రంబులఁ గృపార•సంబెసంగఁ, బ్రమదమలరారఁ బేరోలగమున నుండి

మ. ఘనజాతాసన మానినీ వరకృపా • ప్రాప్తాంధ్రభాషాకవి
త్వ నితాంతోజ్జ్వలు నిత్య నిస్తుల మహా•భక్త్యర్చితాంభోరుహా
క్షుని నేమాన లసత్కులోద్భవుని శ్రీ • సూర్యప్రకాశాఖ్యునిన్
ఘనసంప్రీతిని జేరఁజీరి, పలికెన్ • గంభీర వాగ్వైఖరిన్. 13

ఉ. మానితసద్గుణా! వినుము, • మా వచనంబుల నీ ప్రసిద్ధ నే
మానకులుల్ సుధారస స•మాన మనోహర సత్కవిత్వ వి
ద్యానిధు లుజ్జ్వలాకృతి సు•ధానిధులార్జిత రాజరాజ స
న్మానులు మత్కులాశ్రితులు • సిద్ధికకారులయారి యారయన్, 14

ఉ. పుట్టితి వట్టివంశమున • బాల్యపు సత్కవితావధూటిఁ జే
పట్టితి, వార్యులెల్లను సె•బాసని మెచ్చ లసత్సుధారసం
బుట్టిపడంగ నప్పుడప్పు • డొప్పుగ జెప్పితివౌర! మా పయి
న్నెట్టన బద్యగద్యములు • నెమ్మిని సూర్యప్రకాశ సత్కవీ! 15

గీ. అవధు యంత్రమాత్ర•మునఁ దృప్తిఁజెందక, నస్మదాత్మత్కృ•తామృతాభ
మధురవాక్సృతికి • నధిపతిత్వము; నొంద నొసఁగ నభిలషించు•చుండె గాన.

మ. సరవిన్ సత్కవులెల్ల నుల్లసిల న•స్మద్వంశ చారిత్రముం
సరసంబై మృదువై మనోజ్ఞమయి స•న్మద్భావార్థ సందర్భ సుం
దరమై యింపగు శైలి సత్కృతి ను•ద్యద్రీతిఁ గావించి న
స్వగుణిం జేయుము సద్యశంబు జగతి•న్వ్యాపించి దీపింపఁగన్. 17

వ. అని పలికి సగౌరవంబుగఁ గర్పూర తాంబూలంబును సమూల్యాంబరాభరణం
బులును నొసంగి వీడ్కొల్పిన నేను సంతుష్టాంతరంగుండనై నిజనికేతం
బున కేతెంచి యిమ్మనమ్మున. 18

ఉ. ఎన్నియొ యేండ్లనుండి మన • నీ నరనాథులచేత సాతతా?
భ్యున్నతరీతిఁ బ్రోవఁబడు • చుంటిమి మాన్యము లగ్రహారముల్

చెక్కు గనిచ్ఛి నృపతి ♦ శేఖరు శ్రీకరు సత్కృతీశ్వరున్
గ్రన్నన జేసి, సద్వరము ♦ గాంచెదఁ జూపెద మర్త్యలోకతన్. 19

గీ. ఆ యీయ నాజ్ఞ దీతని ♦ యావరంబె, మనకుఁ బడికోట్లధనములు ♦ న్య్వసమరస వి
హీనసమరఁ బ్రతియిచ్చుట ♦ నొంచిమానఁ,
బాడిదెను బోయుపన్నరు ♦ పోల్కి గాదె. 20

వ. అని నిశ్చయించి యత్యంత సంతోషాక్రాంత స్వాంతుండనై. 21

## షష్ఠ్యంతములు.

క. శ్రీమంతునకు వసంత సు, ధీమంతునకఖిల రిపుల ♦ తిపరాజననీ
హేమంతునకతివాశ్రిత, సామంతున కరుణ్యపాల ♦ సత్స్వాంతునకున్.

క. ఈశ్వరధరవిద్యాఘటా, ఖర్వభుజాశైత్యవునకు ♦ ఘనదోశ్వర్యో
ద్గర్వితరిపుపార్థివుల, గీర్వాణేశ్వరునకుమను ♦ శ్వేతసాదునకున్. 23

క. శ్రీకనకమంబరీ కాం, తాకాంతాకల్పకల్ప ♦ నా నిర్మలునకున్
లోకస్తుత సుశ్లోకున, కాకారవిలాస విహసి ♦ తాబ్జశరునకున్. 24

క. శ్రీరమ్యచంద్రశేఖర, భూరమణాకృపాప్రభూత ♦ పుణ్యాకృతికిన్
శ్రీనాధుని రాజ్యలక్ష్మ్యం, భోరుహపద్మగర్భ శుక్తి ♦ ముక్తామణికిన్. 25

క. శ్రీవిభవేంద్రునకు సుధీ, శ్రీవైభవ నిర్జితద్వి ♦ జేంద్రునకున్
శ్రీవిశ్వేశ్వర నిశ్యం, కావనిపతిచంద్రునకు ద ♦ యాసాంద్రునకున్. 26

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన నిశ్శంక చరిత్రంబునకు
గథావిధానం బెట్టిదనిన. 27

## శ్రీ చంద్రవంశము.

సీ. ఎవ్వాఁడు ప్రభవించె ♦ నెనలేని కళలాని, యమితవిశుద్ధ ద ♦ గ్ధాంబురాశి
నెవ్వాఁడు సద్వంద్య ♦ హితవృత్తి గిరముల, నెరపియయ్యుత్పలి ♦ నీ వధూటి
నెవ్వాఁడు పోషించు ♦ నెన్వేళ బున్వడై, రహిమించి సకలగీ ♦ ర్వాణరాజి
నెవ్వాఁడు వెలిగించు ♦ నిరులనెల్లహరించి, యింపారువాన్నెల ♦ నిద్ధరిత్రి
నతఁడు చెలువందు నిందిర ♦ కనుఁగుఁదమ్ముఁ,
డలరువిల్తునిమామ సో ♦ యగము సీమ,
తామరలమూఁడు పెనుజింకఁ ♦ దాల్చువాఁడు,
జక్కవలకెల్లఁ బగవాఁడు ♦ చక్కఁ నోఁడు. 28

ఉ. ఆతనికిం జనించెను మ♦హామతిరమ్యుఁడు సౌమ్యుఁ డాగుణో
పేతున కుద్భవించె నర♦ భీకరుఁడైన పురూరవుండు త
ద్భూతల నేతకుం బొడమె♦ భూనుతుఁ డాయువు భూరివైభవుం
డాతనికిం జనించె నహు♦షాఖ్యుఁడు కల్గె యయాతి వానికిన్.

క. తద్వంశంబున సకల జ,గద్వినుత విశుద్ధకీర్తి♦ కాంతాస్మిత భా
స్వద్విశదాశాంతుఁడు వి,ద్వద్వర్ణిత చరితుఁడైన♦ భరతుఁడు పుట్టెన్. 30

క. తద్భరతాన్వయమునఁ బ్రియ, ప్రణమద్భూవరమకుటరత్న♦మహితపదుఁ డనం
తద్భుజులు ధర్మజాదులు, సద్భావులు ధర్మరతులు♦ జనియించి రొగిన్.

## శ్రీదామోదర మహీపతి.

గీ. వారివంశంబునందున♦ వక్రవిక్ర
మక్రమ శ్రీవిలాస శ్రీ♦ విక్రముండు
మేనర యశోధరుండు దా♦మోదరుండు,
ప్రభవ మొందె జనుల్ భూరి♦ విభవమంద. 32

శా. ఆదామోదర మేదినీరమణుఁ డు♦ద్యద్భక్తి సమ్మోదిత
శ్రీ దామోదరుఁడై వినిర్మల యశ♦ శ్రీ సుందరీ వక్త్రసం
ఫ్రోద్రిదాత్తస్మితచంద్రికా రుచిర ది♦గ్ద్వీపూతలుండై, హితా
ప్లావ శ్రీకర భూరి దోర్బలయుతుం♦డై, మించె సంచద్గతిన్. 33

సీ. అలఘులక్ష్మీమనో♦హరవృత్తిని వహించి, విబుధ సంపోషణా♦భిరతి మించి
పురుషోత్తమాభిఖ్యఁ♦ బొల్పుమీర ధరించి, ఘనమధువైరిఖ♦ఖ్యాతి గాంచి
సద్రాజశేఖర♦ సఖ్యతఁ దీపించి, శ్రీవత్సభూషణ♦ శ్రీ ధరించి
పంకజనేత్ర సం♦పత్తిని రాణించి, ధర్మదుకూలశో♦భను గడించి
ధీరదామోదరత్వమా♦పాదనమును, నిండు వేడుకఁ దామోద♦రుండు వోలె
సర్వలోకావనక్రియా♦ఖర్వనిపుణుఁడై, కరంబొప్పె విబుధాళి♦యభినుతింప.

క. ఆతని వంశంబతి వి,ఖ్యాతంబై నిగతనిహాతి♦ ఘన దుష్కృత సం
ఘాతంబై పూతంబై, యాతత దామోదరాన్వ♦యంబనఁ దనరెన్. 35

సీ. శ్రీమదద్యాన్వయ♦ శ్రీసముద్భవభూమి, లలిత దామోదర♦ కులపయోధి
మహితసద్గుణ ధీర♦మణిగణాకరము శ్రీ, లలిత దామోదర♦ కులపయోధి
సత్కళాలంకృత రాజ♦చంద్రోదయోన్నతి, లలిత దామోదర♦ కులపయోధి

ఘనదానశీల సం♦జ్జనకల్పకోద్భాసి, లలిత దామోదర ♦ కులపయోధి
ధారుణీసురకనకగిరో♦దారదాన, వారిధారా ప్రవాహ ప♦వర్ధిత స్వ
రత్నరత్నాకరరంగత్త ♦ రంగహారి, లలిత దామోదరాహ్వయ♦ కలశపయోధి.

మ. అనివిద్వద్వరులుం గవీశ్వరులు ని♦త్యంబెన్నఁ జెన్నారు ద
ద్ఘన వంశంబున బుట్టి యుద్ధత బలో♦న్మత్తారి వీరాంగనా
జవతాకీర్ణ శిరోజభాగపతితం♦బత్పుష్ప సంఘన్న దా
రుణ సంగ్రామ మహీతలుల్ నృపతి సం♦ర్యుల్పలుల్వ్యయద్యద్గతిన్. 47

శా. తద్రాజపరికరంబునం బ్రముఖుఁడై ♦ ధాత్రీతలంబేలె ప
ద్వద్రాజపరిణిర్వ్యగర్జిత మహా♦బాహాబలోపార్జితో
ద్యద్రాజ్యాధిపుఁడుగ్ర తేజుఁడు నిలిం♦పాధీశ సంకాశ సం
పద్రమ్యుండల రామచంద్ర ధరణీ♦పాలుండు లీలాఢ్యుఁడై. 38

శ్రీరామచంద్ర నిశ్శంక మహీరమణుఁడు.

సీ. అనవద్యహృద్యవి♦ద్యావిశేషంబున, నంభోజ సంభవు♦ నపహసించి
స్తవనీయ ఘనమనీ♦షా వైభవంబున, దేవతాచార్యు న♦తిక్రమించి
కమనీయ రూపరే♦ఖావిలాసంబున, నిందిరానందను♦ నేవగించి
ధీజనస్తుత మహా♦తేజస్సమున్నతి, రాజీవమిత్రు ని♦రాకరించి
చెలఁగె నుజ్జ్వలకీర్తి స♦శేషఖలని, పతుల నేత్ర నిమీలన♦ప్రక్రియా ప్ర
దక్షభూరిభయంకరో♦ద్యత్ప్రతాప, సాంద్రుఁడగు రామచంద్రనరేంద్రుఁ డేపని.

క. నందితహితుఁడతఁ డుత్తర, హిందూస్థానంబునుండి ♦ యేతెంచి లస
న్నందాపురీ సమీపము, నందాక రాజ్యముఁ గడించె ♦ హతశాత్రవుఁడై.

క. ఆరాజ్యమునకు మున్నల, స్వారాజ్యమునకుఁ బలారి పగిది నభిషిక్తుం
డై రాజరాజిలి నుత, శ్రీరాజితుఁడై యతండు ♦ చెలువలరారన్.

ఉ. ఆతపన ప్రభుండు చతు♦రంగబలంబులతోడఁ గూడి వి
ఖ్యాతమహా భుజాబల స♦ముంచితుఁడై యనిశత్రుభూవర
వ్రాతము నొంచి తత్ప్రకట♦రాజ్యగమంగొని ప్రస్ఫురత్ప్రతా
పాతిశయంబునం దనరె ♦ నార్యజనంబనయంబు మెచ్చఁగన్. 42

ఉ. కూలిన సద్భటావళులు ♦ కుప్పలుకుప్పలుగా రణస్థలిన్
వ్రాలిన గంధసింధుర తు♦రంగ శతాంగములాచు సైన్యముల్

దూలినఁ బాగఁ జూడ రహిఁ దత్తదధీశ్వరకల్పితామర
స్త్రీలలితోపగూహన విశేష సుఖానుభవైక లోలురై. 43

క. ఆమండ్కిఁ నాతఁడొసఁగు సం, గ్రామంబొనరించి శత్రుగణ సంహారణ
శ్రీ నెగయఁ నప్పురి సం, గ్రామవసతి యనెడు పేర నగరము లరారెన్ 44

గీ. వరుస నప్పురిసంగమవలస యనుచు, నఖిలజనములుపల్కుచుఁ దాంధ్రభాష
నెల్లవారలనుందేటఁ దెల్లములగు పల్కులనె వాడుదురుగా దెప్రాజ్ఞు లెల్ల.

చ. తనకది రాజధానియయి తద్దయుగ్రాల విశేష శేముషీ
ఘనులగు సజ్జనుల్ గొలువ గంధగజాశ్వ శతాంగ వాహినుల్
గొనకొని చెన్నుమీఱ బుధకోటి నుతింప నితాంతవైభవం
బొనరగ నమ్మహీరమణుఁ డుర్వర నేలె నఖర్వవైఖరిన్. 46

చ. గరళధరుండు చక్రిబహుకంటక సంయుతమద్రిరాజ ని
ష్ఠురతన దేహిమార్గపతి శూద్రరజో భరితంబు తద్దిశా
కరిగలమంచు దోసి మహికాంత కృపాకరుసౌమ్యముబుభా
వు రుచిరరామచంద్ర నృపపుంగవుఁ జెందె దృఢానురాగయై. 47

సీ. ప్రమదోగ్ర కరకులప్రథవుండు గాఁడేని, చిననాడె స్త్రీవధఁ జేయఁడేని
కమనీయ ధర్మధనంగంబు సలుపఁడేని, పాండుజాక్షనయఁజే పట్టఁడేని
పట్టాభిషేకవైభవ హానిఁగనఁడేని, మునివృత్తివనవాస మొనయఁడేని
పడతిఁగోల్పడి కడుసిడుములఁ బడఁడేని, చెలిమి మృగాళితో సలుపఁడేని
రహిని సరియనవచ్చు శ్రీరామచంద్రు,
నధిక తేజోజ్జ్వలుండు మహాబలుండు
శాత్రవభయంకరుండు భాస్వద్గుణుండు
నైన శ్రీరామచంద్ర భూజానికరయ. 48

క. ఆరామచంద్రనృపతి బు, ధారాధనరతి నిజపురాసన్న ధరి
శ్రీ రాజిత నందాపుర, భూరమణుని మిత్రుఁడగుచుఁ బొల్పల రారెన్.

వ. అంత నొక్క సమయంబున. 49

మ. హరిమాతంగ శతాంగ సద్భట సమూహాధ్యంచితంబై భయం
కరమై శాత్రవసైన్యమభ్రపతి తుంగగ్రామముం గప్పఁ వై
ఖరి నందాపుర రాజముం బొడవఁడఁ త్రొక్కుచుండు భీతాత్ముఁడై
వరమిత్రుండగు రామచంద్రపతికి కష్టార్థం దగం బంపినన్. 50

శా. తత్కృత్యాంతము రామచంద్రజనలోకాధీశుఁ డాలించి తో
పాటేశంబున వెంచి మత్సఖుని పోత్రీలాహా! రిపుల్ గప్పిరే!
యీ వీయు స్మృతి సన్ను వారెఱుఁగరే! హా! గ్రామంగా నిమ్ము నే
నీ దేశంబును దెంచి శత్రులతతిన్ హింసింతు నవ్యగ్రతన్. 51

గీ. అని వచించి నృపతి యప్పుడ చతురంగ, బలములను సఖుని పట్టణంబుఁ
జేరి నాహవసార మారయకంబునఁ దద్వి, పక్షజనభవాళిఁ బారఁదోలె. 52

వ. ఇట్లు నక్రభుజా విక్రమంబు మెఱయ విద్రావిత మహోద్దండ శత్రుమండలుం
డై రామచంద్రమహీమండలాఖండలుండు నిజ సఖావలోకన కుతూహలా
యత్తచిత్తుం డగుచుఁ గోటలోనికిం జనునంత. 53

మ. హతశత్రుండగు రామచంద్రనరలోకాధీశు నందాపురీ
పతి వీక్షించి కవుఁగిలించి ముదమొప్పన్ హస్తముం బట్టి ప్ర
స్తుతబాహాబల, నీప్రతాపము గడున్ శౌర్యంబు నీవంటి స్నే
హితుఁడే వ్వానికిఁ గల్గు నే జగతి నాకే కాక చర్చింపఁగన్. 54

గీ. నీపవిత్రాహార్యుఁ డిప్పుడు తేజు వెలుఁగ,
ఘన మదాంధవిపక్షాంధ కారమణఁగ,
మన్మనోబ్జంబు వికసన మహిమఁ దనరె
నా కమిత తేజమువై సహస్రాంశువిధిని 55

చ. నమితశుభా, నీవిపుడు నాకొనరించిన యిమ్మహోపకా
రమునకు నే నికద్దియను బ్రత్యుపకారము నెవ్వఁ డాల; నీ
సముచితశీలముల్ సుగుణజాలము నిప్పటి సత్సహాయముల్
సముచిత సఖ్యముల్ మఱవఁజాల మనంబున నెప్పుడున్ సఖా. 56

సీ. సంగరాంగణమందు నిశ్శంకవృత్తిఁ దోర్బలము మీర దుష్టులనోడించినట్టు
నీకు నిర్మింపఁ దెను మహనీయమైన, కీరదమిచ్చితిఁ గా కొమ్ము పృథుబలాఢ్య

గీ. ఒక్క నీవకాదు చక్కఁగ మీ వంశ, మ్ముందు సంతతంబునందు వట్టి
రుల్లధూమివరులు నీల సద్విభవంబుఁ, బూనఁ దగు యశంబుఁ బొసఁగు సఖుడ.

క. అని పల్కి మణివిభూషణ, కనకాంబర గజ తురంగ గణముల సౌఖ్యం
బునఁ గానుకలిడి నంపె, గొనుచున్ శ్రీరామచంద్ర కుతలేంద్రుఁ డాగెన్.

డీ నరేంద్రాగ్రగణ్యు నహీనదాన, గరిమ కర్ణుగాఁ గయని ◆ కవీశ్వరులు పొగడఁ
గ్రాలె విబుధాబ్జవనపాళి ◆ బాలహేళి, రాజితగుణాళి మంథన ◆ రాజమౌళి

సీ. యమున తరంగిణీ ◆ యందు మజ్జనమాడి, క్షీరాబ్ధి తెలిపట్టు ◆ చీరఁ గట్టి
శరదిందుచంద్రికా ◆ చందనంబు నలంది, లలిత కస్తూరి తి ◆ లకము దిద్ది
తారకావళీ మౌక్తిక ◆ హారంబులు ధరించి, మందారపుష్ప దా ◆ మములఁ దురిమి
చుక్కలసామి చే ◆ ద్దుక్కఁ గైదాల్చి, సరససరస్వతీ ◆ సఖిని గూడి
యోలసన్మూర్తికీర్తి కాం ◆ తాలలామ, భాసుర మరాళగమన వి ◆ లాస మలర
నెల్లజనముల యుల్లంబు ◆ లుల్లసిల్ల, హాళి నిర్ధారుణీస్థలిఁ ◆ గేళి సల్పె. 67

మ. తననిశ్శంక మహాంక మిజ్జగతి హృ ◆ ద్యంబై బుధస్తుత్యమై
ఘనమై యా రవిచంద్రతారకముగాఁ ◆ గ్రాలన్ జనుల్ ప్రాపురే
యన నిశ్శంక పురాగ్రహారమును ని ◆ ర్మించి బాగ నేమాన గం
గనవిద్వన్మణికిచ్చి మంథనమహీ ◆ కాంతుండు కీర్తిన్ గనెన్. 68

క. వెండియును ద్విజాలకుఁ దద్భూ, మండలపతి యొసఁగెఁ జెన్ను ◆ మాన్యంబులు శ్రీ
ఖండశరపుండరీకా, ఖండల గజకుండలీంద్ర ◆ కలిత యశుండై. 69

గీ. అతి గభీరతయును క్షమా ◆ లాభిరతియు,
సరసభావంబు భూరి ప్ర ◆ సన్నతయును
మధురగుణమును తద్రాజ ◆ మౌళియందె
కాదు తత్కృతి ఘనతటా ◆ కములఁ గలవు. 70

## శ్రీజమ్మన నిశ్శంక నృపాలుఁడు.

మ. అలఘు శ్రీనిధి కర్దరాధిపతి క ◆ త్యంత ప్రభాస్వద్యశో
జలజాక్షీవదన ప్రభూత దర ◆ హాసస్ఫార సుశ్రీకృపా
కలితాకాంతుఁడు జమ్మనాహ్వయ మహీ ◆ కాంతుండు నిశ్శంక వీ
ట్కులశిస్ఖపతిభుండు సజ్జన విభుం ◆ డుం బుట్టె రంజిల్లగన్ 17

శా. ఆరాజన్యతనయుంబునం బ్రథముఁడై యత్యంత దుష్టద్విష
న్నారీలోక విలోక వాంత విగళ ◆ ద్బాష్పప్రధారాత్రితలుం
డై రంజిల్లెడు జమ్మనప్రభుఁడు రా ◆ జ్యాధీశుఁడై యుర్విఁ జె
ల్వారెం గల్జనరాజవాళి యుపరా ◆ జై మూర్కి సేవింపఁగన్. 72

మ. ఉరుబాహాబలుఁడై కరంబలరు స • య్యుర్వీశు
న్నిగతింబొప్పఁ గృపాణభోగియొరయన్ • సిద్ధోక్తముల్
కిరమై శత్రుగళాళిగళదసృ • గ్ధారం దగన్మన్ని త
త్ప్రాణ సమీరముల్ గొని పమి • ద్ధాత్రిం జరించెన్ బలెన్. 73

సీ. తనకళావిభవంబు • తనకళావిభవంబు, గతిఁగువలయమిత్ర • గరిమఁ బొల్పఁ
దనవిగ్రహస్ఫూర్తి • తనవిగ్రహస్ఫూర్తి, కరణీనసమబాణ • కలనఁ దనరఁ
దనభాసురసమాఖ్య • తనభాసురసమాఖ్య, రీతిభవ్యాతుర • శ్రీవహింపఁ
దనమహోదయలీల • తనమహోదయలీల, వరబరమహితార్థ • ములఁ జెనఁగ
నలరి నాసేతుశీతన • గాంతరస్థ, ధీరజనవారవర్ణితో • దార సుగుణ
మణివిభూషణ మండల • మండితుండు, వీరవర్యుండు జమ్మనార్వీ • విభుండు.

క. ఆరాజశిరోమణికిఁ గు, మారులు తొమ్మండ్రు బలసమారులు జితభీ
మారులు సుకుమారాకృతి, మారులు ప్రగ్గవిఁ జిరతి సమంజసకీతిన్. 75

## శ్రీసియ్యన నిశ్శంకక్షితినాథుఁడు.

క. వారలలో నగ్రజుఁడతి, ధీరుఁడు సియ్యన విభుండు • స్థిరతరరాజ్య
శ్రీరమణుఁడయ్యె ననుజుఁడు, వీరనపతి సచివుఁడగుచు • విలసిల్లంగన్.

సీ. వికసితేందీవర • వీక్షణంబులతోడ, శైవాలకేశపా • శంబుతోడ
రుచిర రథాంగోరు • కుచకుంభములతోడఁ, గమనీయకమల • కరములతోడ
నవ్యమృణాళ సుం • దరబాహువులతోడ, నలఘుతుంగతరంగ • వళులతోడ
వరబాలహంస భా • స్వరపదంబులతోడ, మత్తమరాళ గ • మనముతోడ
మీఱుసవ్యకృతప్రభూత కాసార రమను, రహిఁ జనించినకీర్తి న • ర్తకి దిగంత
రంగములనటియింపఁ బ్రారంగమహిత, నీతిసియ్యననిశ్శంక • నృపతి జగతి.

సీ. తొలుఁదొల్త సజ్జన • స్తుతులసద్గుణాలతా, కోటిసెల్లెడలను • నాటినాఁడు
ఆవెన్క భూదేవ • తర్పణ దానాంబు, సంచయంబునఁ దగ • బెంచినాఁడు
ఆపై మహామోద • మలర సవ్యశో • కుసుమపంక్తుల నొనగూర్చినాఁడు
అంతట సకలదే • శాంతరాగత సుధీ, చంచరీకాళిఁ బోషించినాఁడు
బాపురే! యిన్వసుంధరా • పాలుఁడెంత,
చతురమతియని జనులెల్ల • వితతగతుల,

గీ. అచటఁ జేరి సమీపమం ♦ దలయుచున్న, యధిక బాహాబలోపేతు ♦ నఖిలకార్య
నిపుణు జియ్యాననిశ్శంక ♦ నృపతిచంద్రుఁ, ధీరు బాసటగ నమ్మని ♦ కోరుటయును.

క. ఆ జియ్యాన నిశ్శంక మ, హీజాని యహీన వా ♦ హినీకుఁడగుచుఁ ద
ద్రాజ్యమునకు సహాయము, గా జని తద్విహిత కార్య ♦ గతిఁ జతురుండై. 85

గీ. పృనుల సామదాన ♦ భేదదండాద్యుపా, యముల నచటి జనుల ♦ నధిక భక్తి
యుక్తులుగ నొనర్చి ♦ రక్తి శ్రీబలరామ, దేవు నచట నిలిపె ♦ కీర్తి మెరయ.

క. అంతట బలరామవిభుం, డెంతయు సంతసముఁ జెంది ♦ హితు జియ్యాన భూ
కాంతునతికాంతు మృదువా, క్సంతతి నలరించి పంపె ♦ సద్వినయమునన్.

గీ. అంత జియ్యాన నిశ్శంకుఁ ♦ డాత్మరాజ,
ధాని కరుదెంచి సుగుణ ని ♦ ధానమును మ,
హెల్ల కవులెన్న భూతలం ♦ బేలె జనము,
లుత్సవముఁ జెందఁ బెక్కు సం ♦ వత్సరములు. 88

## పెద్దన నిశ్శంక క్ష్మాపాలుఁడు.

క. ఆ నరవర శేఖరునకు, భూసుతుఁడగు పెద్దనయును ♦ భూరి మనీషా
శ్రీనిధియగు కల్లనయును, జానుగ నుద్భయించి రెల్ల ♦ జను లుప్పొంగన్.

క. ఆ పెద్దన నిశ్శంక మ, హీపతి తద్రాజ్యమున క ♦ ధీశుఁడయి లలిం
దీపించెఁ గల్లన ప్రభుఁ, డోపిక యువరాజుగాఁగ ♦ నున్నత రీతిన్. 90

క. శక్తిత్రయాంచితుండై, సూక్తి వచస్క్రియలనెల్ల ♦ సుజనావళులన్
రక్తిం గొల్పుచు వ్యసనా, సక్తుఁడుగా కతఁడు ప్రజల ♦ సంరక్షించెన్.

గీ. అఖిలశత్రువితతి ♦ కపరిభేద్యమ్మును, దోమకయిన మిగుల ♦ దుర్గమమ్ము
నై తొనంగు కోట ♦ నారాజు నిర్మించి, యలమి కలిమిఁ బుడమి ♦ నేలుచుండె.

ఉ. అంతఁ జింతామణీపురవ ♦ రాధిపుఁడైన ఘోసాయి యొక్కఁ డ
త్యంతబలుండు శ్రీజయపు ♦ రాధిప గౌరవజాభిమాన మం
తంతకు మీరఁ బ్రాంతమహి ♦ పాళిఁ గల్పి ద్విషత్తమిస్ర భా
స్వంతుని పెద్దనక్షితిప ♦ చంద్రునిఁ గూడఁ జయించు పూనికన్. 93

గీ. గజము లశ్వంబులును శతాం♦గములు భటులుఁ
గొలువ నరుదెంచి సంగము♦పలసకోటఁ
బాదుశాఁ గని పెద్దనా♦ర్యవిభుండు తోకఁ
ద్రొక్కఁబడిన మహాహి నా♦గుండుఁ బోలె. 94

చ. కనుగవ యొఱ్ఱతామరల ♦ కాంతి వహించి ఘనస్ఫులింగ సం
క్తిని గురియంగఁ భ్రూయుగ ♦ మొగిం గలయంగఁ గ్రుధా సమేతుఁడై
మునిశిత వీరవైరిగణ♦శోణితసిక్త కృపాణమూని స
య్యన నరిసేనఁ దాకెఁ బటు♦టంకగజాంచితుఁడై మహోద్ధతిన్. 95

చ. అలవన వహ్నికప్పుడహ ♦ నాళిఁ దహించునటుల్ గజంబు ని
స్తుల జలజాకరంబుకడిఁ ♦ జొచ్చి కలంచు విధంబు సన్మహీ
తలపతి శత్రుసైన్యముఁ ♦ దద్దయు నుగ్గుగఁ జేసి ధారుణీ
స్థలి విహరింపఁ జేసెఁ గసి♦తిస్ఫురితా మితసక్త నిర్ఝరుల్. 96

క. తనసైన్యము తద్దయు నా,
శన మొందినఁ గని ఘనాసాయి ♦ చాలభయమొదం
గాని హతశేషులతోఁ జ,
య్యనఁ బారె సమీరహత మ♦హాభ్రము పోలెన్. 97

గీ. అవనిపతియును వెంటనం♦టె యాతని వెం,
గాముదనుకఁ దరుమ♦గా నరిందు,
లేఁకి రాజచంద్రి, ♦ దాసోహమిక నన్ను
విడువు, మనుచు మిగుల ♦ వేడికొనుచు. 98

చ. ఉరువినయంబు సన్నిలిచి ♦ యున్న ఘనాసాయిని గాంచి ధారుణీ
శ్వరమణి యాగ్రహం బుడిగి ♦ చాలును నీదు పరాక్రమంబు మే
మెఱుఁగుదు మిట్టిచేష్టలిఁక ♦ నెన్నఁడుఁ జేయకు మేగు మింటికిన్
సరగనటంచుఁ బంచి, నిజ♦సత్పురిఁ జేరె ముదం బెలర్పఁగన్. 99

గీ. ఆర్యులు నుతింప నలగంగ♦మాంబ యనెడు,
పుణ్యమతి, సతీతిలకంబు, ♦ పూతచరిత,
చెలిమిఁ బరిణయమ్మై నృపు♦ఁ డింద్రులీల
వసుమ సద్భోగ భాగ్యంబు ♦ ననుభవించె. 100

గీ. గంగమాంబిక సత్కీర్తి • కలితకీర్తి,
యెల్లకాలము జగతి శో•భిల్లఁ జేయ,
గంగమాంబా పురంబను • ఘనతరాగ్ర
హారము నొసర్చెఁ బతి భూసు•రార్పణముగ. 101

క. మఱియు విరచించె గంగా,
పురమను గ్రామాబ్ధికంబు • భూసుర భూరిశుభా
కరమై, సమస్త సంప
త్కరమై, సకలజనసౌఖ్య • కరమై, పరలన్. 102

సీ. అధికమనఃఫల స•మావితంబులు, సర్వ
విధ విచిత్రపసుమ • విలసితంబు
లై, కరం బెసంగు • నారామముల, బ్రతి
ష్ఠించి యచటఁ జు మిగుల • జెన్నుమీరె. 103

గీ. ముందు రాజ్యలక్ష్మి •నొంది, యా పిమ్మట,
విజయలక్ష్మిఁ బొంది, • వెనుక, వితత
దానలక్ష్మినంది, • తదనంతరమున, స
త్కీర్తిలక్ష్మిఁ జెంది, • క్షితిపుఁ డలరె. 104

మ. పటుబాహాబలశాలి పెద్దనమహా•పాలుండు గంగాంబికా
స్ఫుటగర్భంబునఁ బ్రాజ్ఞుఁ డిమ్మడి విభున్ • శుంభత్కృపాసాంద్రు వేం
కట నిశ్శంకధరాతలేంద్రు బుధసం•ఘాతస్తుతోద్యన్మహో
త్కట మేధానిధి వీరసక్షితిపతిన్ • గాంచెన్ సమంచద్గతిన్. 105

## శ్రీ వేంకట నిశ్శంక ధరాధినాథుఁడు.

క. ఆ రాజవరాళి పిమ్మట్ను ధీరుఁడు తమ్మనవిభుండు • దేశాంతర సం
చారియగుట వేంకటధా, త్రీరమణుఁడు రాజ్యమున క•ధీశ్వరుఁడయ్యెన్

క. అనుజన్ముని వీరనవిభు, ననఘాత్ము నమాత్యపదవి•నందుంచి బుధా
వనుఁడై వేంకటనిశ్శం, కనృపాలుఁడు పుడమి నేలె • గౌరవ మెసఁగన్.

క. విపుల న్యాయ్యతముగ నిజ, విపులయశము చెన్నుమీర • వేంకటనిశ్శం
క పురాగ్రహారము సంగెను, నృపతిమహీసురలకతిసు•కృతరతుఁడగుచున్

వ. తదనంతరంబున. 117

## శ్రీపెద్దన నిశ్శంక పృథివీపతి.

క. ఆరాజ సుతులలోపల, నారూఢబలుండు పెద్దనాధిపుఁడు మహీ
భారంబుఁ దాల్చె ననుజుఁడు, వీరుఁడు కత్తినయామాత్యు వినులొనరింపన్.

మ. అతిధర్మాత్ముఁ డతి ప్రభామహితుఁ డత్యంత ప్రతాపోజ్జ్వలుం
డతిసత్త్రాణన తత్పరుం డతి మనోజ్ఞాకారుఁడౌచు న్బుధ
ప్రతతుల్ ప్రస్తుతిసేయఁ బెద్దనమహీపాలుండు ధాత్రీస్థలిన్
వితతానందముతోడ నేలె యశముర్విం గప్పి యొప్పారఁగన్. 119

గీ. అమల గుణమణిఖని గంగమాంబయును,
మహితచారిత్ర చంద్రమాంబయుఁ బ్రమోది
తార్య సన్న్యాసమయుఁ బత్నులై యజస్ర
మాత్మనలరింప నెసఁగ నయ్యవని విభుఁడు. 120

మ. తన సత్కీర్తి ధరిత్రి శాశ్వతముగా స్థాపింప నూహించి పె
ద్దన భూభర్త కవీంద్రచంద్రు లతి సాంద్రశ్రీతివర్ణింపఁ బె
ద్దన నిశ్శంక పురాగ్రహారమును ప్రోద్యన్మహాస్య సుక్షేత్రముల్
వెనరొప్పార నొసంగి భూసురులఁ దన్పె న్భూరి పుణ్యాత్ముఁడై. 121

గీ. మఱియు ననుజుండు కత్తన మనుజ విభుఁడు
ధాత్రిఁబ్రార్థింప నాతని పత్నిపేర,
శీతమాంబా పురాభిఖ్యఁ బెలుగు నగ్ర
హార మొసరించె ధరణిసురాగ్రణముగ. 122

సీ. ఆపెద్దనాహ్వయ • క్ష్మాపాలుఁ డాత్మసుతుం,
బంబునం గఱపంబుఁ గలుఁగ;
మనమున నిర్వేద • మును బొంది మూఁడవ
భాగ్యవద్గుణమూర్తి • భవ్యచర్య
సన్న్యసనాంబ భాంస్వత్త్రితిదోడరం
సముచిత పరిచార • సహితుఁ డగుచు,

శ్రీబొబ్బిలి మహీంద్రుఁ • జేర నాతండా
దరించి మిక్కిలి గౌరవించి, తనదు
నగరిలో నొక ఘనసదనంబొసంగి,
యింపుమీరఁగ నందుఁ బోషింపఁ జేసి,
యనవరతమును వారి సౌఖ్యాతిశయము,
లమర నారయుచుండె నయ్యవసరమున. 123

క. పరమేశ్వరుగురుకరుణా, భరమున సన్యాసమాంబ వరగర్భంబున్
ధరియించెఁ బతియు హితులుఁ, బరమోత్సాహంబు జెంది • భాసిల్లంగన్

గీ. ఘనకళాంచితుఁ డగు రాజు • గర్భమందు
భాసిలుచునుండు, సాధ్వి సన్యాసమాంబ,
ఘన కళాంచితుఁ డగు రాజుఁ • గాంచనున్న
ప్రాగ్దిగంగన చందాన • బాగుమీరె. 125

గీ. రహిసతీమణి గర్భసం • రక్షణంబు,
విభుఁ డొనర్చుచు నున్నంత • విధియు నధిప
చాలు నీలోకభోగంబు • స్వర్గభోగ,
మెనయరమ్మని తోడ్కొని • చనియె నతని. 126

## శ్రీమృత్యుంజయ నిశ్శంక రాజేంద్రుఁడు.

శా. అంతం గొన్ని దినంబులేగ జనుల • త్యానందముం జెంద న
త్యంతోద్యచ్ఛుభ వాసరంబు నను స • న్యాసాంబఁ గాంచెన్ సుధీ
మంతున్ సద్బలవంతు సమ్మదిత సా • మంతున్ యశోవంతు శ్రీ
మంతున్ నీరజనేత్రు నీలమణి సం • భద్గాత్రునిం బుత్రునిన్. 127

సీ. ఆరాజ సుతుఁ గాంచి • యనురాగమునఁ బెంచి
నగమేదినీరావు • వంశ సంభ
వుఁడు మేనమామ ప్రాజ్ఞుఁడు నారసింహ
భూపాలుండు • బుధపాళి మేలనంగఁ
దనదు మేనల్లుఁడు • ధరఁ జిరంజీవియై
యుద్ధవైఖరి నభివృద్ధిఁ జెంద,

శ్రీబొబ్బిలి మహీంద్రుఁ • జేర నాతండా
దరించి మిక్కిలి గౌరవించి, తనదు
నగరిలో నొక ఘనసదనంబొసంగి,
యింపువిహారుఁగ నందుఁ నివసింపఁ జేసి,
యనవరతము వారి సౌఖ్యాతిశయము,
లమర వారయుచుండె నయ్యవసరమున. 123

క. పరమేశ్వరుగురుకరుణా, భరమున సన్యాసమాంబ వరగర్భంబున్
ధరియించెఁ బతియు హితులును, బరమోత్సాహంబు జెంది • భాసిల్లంగన్

సీ. ఘనకలాంచితుఁ డగు రాజు • గర్భమందు
భాసిలుచునుండె, సాధ్వి సన్యాసమాంబ,
ఘన కలాంచితుఁ డగు రాజుఁ • గాంచనున్న
ప్రాగ్దిగంగన చందాన • బాగుమీఱ. 125

గీ. రవిసతీమణి గర్భసం • రక్షణంబు,
విభుఁ డొనర్చుచు నున్నంత • విధియుఁ నధిప
వాలు నీలోకభోగంబు • స్వర్గభోగ,
మెనయ రమ్మని తోడ్కొని • చనియె నతని. 126

## శ్రీమృత్యుంజయ నిశ్శంక రాజేంద్రుఁడు.

శా. అంతం గొన్ని దినంబులేగ జనులానందము నొంద న
త్యంతోదగ్రశుభ వాసరంబు నను సన్యాసాంబ గాంచెన్ సుధీ
మంతున్ సద్బలవంతు సమ్మదిత సామంతున్ యశోవంతు శ్రీ
మంతున్ నీరజనేత్రు నీలమణి కుంభద్ద్యుతునిం బుత్రునిన్. 127

సీ. ఆరాజ సుతుఁ గాంచి • యనురాగమునమించి
నగమేదినీరావు • వంశ సంభ
వుఁడు మేనమామ ప్రాజ్ఞుఁడు శారసింహా
భూపాలుండు • బుధపాళి మెలఁకంగఁ
దనదు మేనల్లుఁడు • ధరఁ జిరజీవియై
యుద్ధవైభవ సభిప్రవృద్ధిఁ జెంద,

కెమ్మి నృపత్యంజయు • నిశ్శంక భూప
తి యావెడు శుభాభిధేయం బొనర్చి,
పెంచుచును దక్షమాచార • మంచితముగ,
నాంగ్లవిభులకతింగించె • నంతవార
ల సమ సంగమవంలప రాజ్యాధిపత్య
మూసి యబ్బాలునిని మాతులాను మతిని. 128

గీ. జననితో సత్యాగమున విశాఖపురికిఁ
దోడుకొనిచని యచట సంతోషమాత్మ
మీర బాలుని మైనార్టి • తీరువరకు,
నెమ్మి నివసింపఁ దగునని నిశ్చయించి. 129

గీ. మాతులుని, నారసింహ తులమానమణుని,
రక్షకునిగా నియోగించి • రాగ మలర,
నుచిత సేవకజనముల • నొసఁగి విద్య,
లాదరంఁ జేయుచుఁ బోషించు • చుండి రంత. 130

క. బాలకుఁడు బాలచంద్రుని, బోలె దినదినము వృద్ధిఁ జెందుచుఁ గళలన్
గ్రాలుచు నుండెం బ్రేక్షక, జనదృగుత్పలము లమిత • సమ్మద మొందన్.

సీ. ఆ రాజనందనుం • డైదేండ్ల బాలుఁడై, యలరారుచున్నంత • నాంగిలేయ
రాజ్యసంరక్షకుల్ • రహింతక్షురా, భ్యాసగరిమ విధ్యుక్తంబుగా నొనర్చి
పరఁగ నాంధ్రాంగ్లాది • భాషలఁ గరప వేర్వేరుగా గురువుల • ధీరమతుల
నియమించి విద్యల • నేర్పించుచుండిరా, తఁడు పిన్నయయ్యు నత్యంతబుద్ధి
శాలిగావునఁ దగ • స్వల్పకాలమునను,
సకల విద్యలయందలి • చతురుఁడగుచు,
* నెల్లజనముల యుల్లముల్ • పల్లవింప,
పల్లవితకీర్తిఁ జెల్లుగ • నుల్లసిల్లె. 132

గీ. సేనరూప నృసింహ భూజానియాంధ్ర
భూమిఁ బండితుఁ డాటను • బాలుఁ డతని
యొద్దఁ దద్భాషసంతతియు • నొనర నేర్చి
యందు బరిపూర్ణ పాండిత్య • మందె వెలసె. 133

గీ. అంత నాంగ్లేయ భాషయం దనుపమాన
మైన పాండిత్యము గడించి • యాల కలెక్ట
రాదిగాఁ గల దొరలెల్ల • సద్భుతంబు
చెందఁదగు ప్రౌఢిమను గాంచి • చెప్ప మీఱె. 134

సీ. విస్తుల శ్రీపరవస్తు వేంకటరంగ
గురువరు సన్నిధిఁ • బరమ భక్తి,
బ్రకట సత్కావ్య నాటక భాణాలంకార కలి
తసాహిత్య సద్గ్రంథ వితతి,
రహిఁ బఠియించి తర్క వ్యాకరణ మహో
పనిషదద్వైత సుద్వైతములును
శ్రౌతంబు స్మార్తంబు జ్యోతిషంబునులస
ద్వేదాంత వైద్యముల్ విశ్రుతనీతి
యాదిగాఁ గల సద్విద్య • లభ్యసించి,
వాని యందతిచాతుర్య • వైభవంబు,
దగఁ గడించి సుధీవరుల్ పొగడ నెగడె,
ఘనుఁడు సుగుణుండు మృత్యుంజయ ప్రభుండు. 135

గీ. అనుపమాంధ్ర సంస్కృతాద్యఖిలభాష
లందతి మనోహర సుధారసాభ మధుర
లలిత కవితా విలాసంబు కలిగి వెలఁగ,
జగతి మృత్యుంజయాఖ్య నిశ్శంక నృపతి. 136

క. సంగీతశాస్త్రవైఖరు, లం గురుకుశలత గడించి • లలి తత గీతా
భంగకథ లెఱిఁగి వైణిక, పుంగవుఁ డై జగతి రాజపుత్త్రుండలరెన్ 137

సీ. అతండు వ్రాయుచో • నమల ముక్తామణు
ల్పంక్తులుగూర్చిన • పగిది నెగడు,
నాతండు చదువుచో • నత్యంత మధురామృత
రసంబు ప్రవహించు కరణి వరలు,
నాతండు పల్కుచో నతి మృదుభావ గర్భిత
వాక్సమత్కృతుల్ పెంపెసంగు,

నాతంచు పాడువో ♦ నలఘు గంధర్వుల
దివ్యగానములీలఁ ♦ దేజరిల్లు,
ధరణీశ ! యిట్టియట్టి సత్కళా ♦ కలితులైన,
మానవేంద్రకుమారు లెం♦దైనఁ గలరె,
యనుచు జనులెల్ల విస్మయ ♦ మభినుతింప,
నెగడె సన్మతి మృత్యుంజ♦యనృపతి జగతి. 138

క. అందములకు నెలవగు నృప, నందనుఁడు శిశుత్వముడిగి ♦ నవయౌవన ల
క్ష్మిం దనరి సుందరుఁడగుఁ, గందర్పుం డనెడు భ్రాంతి ♦ గలిగించె నిలన్.

చ. సముచిత సత్కళాదివిభవ ♦ సంయుతుఁడై యల మృత్యుజిన్మహీ
రమణుఁడు రాజ్యభారము చి♦రంబుగఁ దాల్ప సమర్థుఁడైనఁ ద
త్సుమహిత రాజ్యమందు నొక ♦ సొంపగఁ ప్రోత్సహించె మాతులుం
డమల మనోంబుజాతుఁ ♦ డయి యయ్యవనీశ్వరవర్యు పేరునన్. 140

సీ. సకలాగమప్రౌఢి ♦ సల్లక్షణనిరూఢి
గరిమలరారు భూ♦సురులు బుధులు,
సంతతోత్కటదాన ♦ జలసమార్ద్రీకృతా
స్థులై చెలంగు క్షా♦త్రభవులు కరులు,
కాంచనమణిచక్ర ♦ ఘనధర్మగుణ
ములఁ గలిగి యొసంగు వై♦శ్యులు రథములు;
విపులాగ్రసేవక ♦ వితతదోహలు లయి
విలసిల్లు శూద్రులు ♦ వీరభటులు,
మనుజప్రపుష్కాశ ♦ మనుకటకేసర,
మల్లికావళీ స♦ముంచితంబులగు,
సరోవరంబు ♦ లారామములుగల్గి,
యప్పురీవరేణ్య ♦ మొప్పు జగతి. 141

వ. ఇవ్విధంబున నెన్నఁదరముకాని వన్నెఁబూని చెన్ను మీరుచున్న యన్న
గరంబున నివసించు నెల్లవారలు విద్యావివేక వినయసంపన్నులును, ప్రభు
భక్తిపరాయణులును గావునఁ జంద్రోదయంబు నభిలషించు చకోరక ప్రక
రంబు చందంబున రాజసందర్శన కుతూహలాయత్తచిత్తులైయుండ, 142

గీ. అంతమైనార్తి తీరఁగ • నవ్వనిపలికి,
రాజ్యమర్పించి రాఁగ్లలా • రాజమణియు,
మహిత పట్టాభిషేక సం • భ్రమ మెలఁగ,
నాత్మనగరంబునకు వేడ్క • నరుగుదెంచి. 143

క. పదునెనిమిదివందల నలు, బదియేడవయేట నవఁబ్లవంగాబ్దమునన్
విదితమతిమృత్యుంజయ్నృపతి, పదమునపట్టాభిషేక • సంపదఁ గాంచెన్. 144

సీ. బహుగండములుగల్గి • పలుమూలలంబడి,
సురిక్కుడు నలమలాద్రి • నహసించి,
కాళ్ళుచేతులు లేక • గడుపునబడిబ్రాకు
శేషాహినాథుని • చెలిమిఁ బాసి,
తలఁదాపఁజాలక • జలధిఁగూఢ ప్ర
వృత్తిఁగ్రిమ్మరు కూర్మ • విభునిరోసి,
ధూళిపంకమునఁ బ్రింగు చొం • టిదియై వనం
బుల జరించువరాహ • మూర్తిఁ దోఁడి,
ధారుణీకాంత యత్యంత • ధైర్యసహితు
ధీరసుధీరమ్ము నతిచారు • దృఢశరీరు,
ననఘచారిత్రు మృత్యుంజ • యావనీంద్రుఁ,
దనకు ననుకూలవరుని గాఁ • దలఁచి చెందె. 145

క. అత్యంత మనోహరమగు, మృత్యుంజయనగరమున న • మిలితయుగమున నా
మృత్యుంజయు నిశ్శంక, క్షిత్యధిపతి శేఖరుండు చెలఁగుచు నుండెన్. 146

గీ. అమ్మహీపతి దౌలత బు, ధాళివినుత,
సద్గుణకదంబముఖజిత • చంద్రబింబ,
ససమ లక్ష్మీనరసమాంబ • నధికహర్ష
మలర బరిణయమై సౌఖ్య • మనుభవించె. 147

క. ఆరమణీమణి యొక్కఁడు, మారిమణిఁ గాంచి పతియు • మతి బంధుజనుల్
మీరినవగఁ బొగుల, మరు, న్నారీమణులెల్ల కలర • నాకము చేరన్. 148

క. ఆమీదినృపాలుఁడు తన, భామామణిమీఁది ప్రేమఁ • బ్రకటించుచుఁ గ
న్యామణికిన్ వజ్జమ్మని, నామముఁ బిడి ప్రోచె నతని • నందనహేతుఁడై. 149

క. ధీరత నొప్పయి సుగుణా, భూరమణీరమణుఁ డగుచుఁ ♦ బొల్పుగ లక్ష్మీ
నారాయణసింహాత్మజ, హీరమణీనామ రమణి నెలమిం జెందెన్. 150

చ. అనుపమరూపయౌవన క♦ళాతిశయంబులఁ జెన్నుమీరు న
వ్వనరుహపత్రనేత్రి యని♦వారిత భూరితరానురాగ శో
భనహృదయాబ్జయై లలిన క♦పారసుఖంబు బొసగూర్చుచుండ న
మ్మనుజ విభుం డొసంగ హరి♦మాడ్కి మహా విభవాభిరాముఁ డై. 151

గీ. సత్యమార్జవంబు, ♦ శాంతంబును, నహింస,
వితరణంబు, భూరి ♦ విక్రమంబు,
దైవభక్తిరక్తి, ♦ తనకు నైజగుణంబు
లై కరంబెసంగ ♦ వాఁ డలరె. 152

సీ. సవనసంతతుల ♦ సరవిఁ జేసెనుగాని
సవన వినాశంబు ♦ సలుపలేదు,
పురములఁ గడువృద్ధిఁ ♦ బొందించెనేగాని
పురముల హరియింపఁ ♦ బూనలేదు,
ఆత్మ జౌన్నత్యంబు ♦ నభిలషించెనుగాని
యాత్మ జౌన్నత్యంబు ♦ నణపలేదు,
అల పుణ్యజనుల దా ♦ నాదరించెనుగాని
యల పుణ్యజనుల జెం♦డాడ లేదు,
భళిర! మృత్యుంజయక్షమా ♦ పాలవర్యుఁ
డరయ మృత్యుంజయునికన్న ♦ నధికమైన,
సుగుణ సంపదగలవాఁడు ♦ సుమతి యనుచు,
ధీరవరులెల్ల వినుతింపఁ ♦ దేజరిల్లె. 153

సీ. కాళిదాసమహా సు♦కవికృతనాటక
త్రయికి వ్యాఖ్యానంబుఁ ♦ దగ ఘటించె,
జనులసదాచార ♦ సంపత్తిఁ జెరియింప
ఘన నీతిశాస్త్రసం♦గ్రహముఁ గూర్చెఁ,
సొంపుగ భక్తిదీ♦పింప నింపగు శైలి
సుయశంభు శతకంబు ♦ నొగి రచించె,
బహుభాషావైభవముఁ ♦ బ్రకటించు రాజశే
ఖరవిలాసంబును ♦ సరవిఁ జెప్పె,

నలఘు గౌరీవివాహంబు • హాస్యకల్లి
సూర్యనారాయణేశ్వర • శుభచరితము,
సత్యభామాకలాపంబు • సద్గుణావ
తారచరితంబుఁ జేసె ను • దారఫణితి. 154

క. గుణయుతుఁ డవ్విభుఁ డతిమృదు, ఫణితిన్వెగడించె భూమి•పతిపాలన ద
ర్పణమను సద్గ్రంథము ప్రా, జ్ఞగణులు భళీభళియటంచు • మతిమతిఁబొగడన్.

సీ. సత్పండితులతోఁ బ్ర•సంగించు వేళల,
సత్పండితునిలీలఁ • జాల నలరు,
గవిరాజితోఁ గవి•త్వవినోద మొ
నరించునతఁడు సుకవీంద్రువై•ఖరి నెసంగు,
గాయకావళితోడఁ • గలసిపాడెడు వేళ
ఘనగాయకుని విధం•బునఁ దనర్చు,
శివవేదాంతుల•తో వచించెడు వేళఁ
బరమవేదాంతికై•వడిఁ బరంగు,
బాపురే! యాతఁ డెట్టి ది•వ్యప్రభావ,
గరిమ కలవాఁడొ•కాని యందఱికి సన్ని
గతులఁ జూపట్టుచుండె నం•చతులనుతుల,
నార్యు లానరింపఁ జెలఁగె • నయ్యపని విభుఁడు. 156

సీ. అమరు నెవ్వాని చి•త్తము చిత్తజారాతి
పాదాబ్జయుగళికి • బంధురముగ,
దనరు నెవ్వాని స•ద్మము పద్మసద్మకు
సుందరతరకేళి • మందిరముగ,
రాజిల్లు నెవ్వాని • తేజంబు ఖలకోటి
కానీకమున కంబు•జాప్తరుచిగ,
బొలుపారు నెవ్వాని • భుజసీమ భూభామ
కత్యంతనవ్యసిం • హాసనముగ,
నట్టి దామోదరాన్వవా•యాబ్ధిసోము,
నతులవిరాము, విలస•ద్యశోభిరాము,
విపులగుణధాము, మృ•త్యుజిన్నప్రపలలాము,
నరయ వినుతింప వశమె యె•వ్వానికైన. 157

సీ. రతసుధీసహితాహి ♦ పతివందితమెవ్వాని
చిత్రపవిత్ర చ♦రిత్రమునకు,
నఖిలాశ్రితాళి సం♦స్తావళి యెవ్వాని
వరకరుణారస ♦ వర్షమునకు,
గూర్చారిగణము ♦ ఘోరారణ్యమెవ్వాని,
యనివార్యశౌర్య ద♦వాగ్నిశిఖకు
మార్తాండబింబంబు ♦ మణికుంభ మెవ్వాని
సత్కీర్తిమౌక్తిక ♦ సౌధమునకు,
నట్టిసద్గుణసాంద్రు, భో♦గామరేంద్రు,
భూరిసౌందర్య విజితసం♦పూర్ణచంద్రు,
రక్షితకృతీంద్రు, మృత్యుంజ♦యక్షితీంద్రు,
నహహా! యభినుతి సేయ నా♦కలవియగునె !! 158

ఉ. సేవకులెట్టి నేరములఁ ♦ జేసిన శాంతమునూని కోపముజ్
భావమునందుఁ జెందక కృ♦పామతి బ్రోతుల కెల్ల దండ్రి, యే
లీవి హితోపదేశము బం♦ధించఁబడేఁ జేయునో యట్టి ద్ధ
శ్రీవరుఁ డిద్ధ బుద్ధుల నె♦తింగగ మెం జనులిప్పు మెచ్చఁగన్. 159

సీ. శ్రీమదుద్యద్యశ శ్రీ♦మనోహరుఁడు, వి
ద్వద్గణ ప్రణుతభా♦స్వద్గుణుండు,
సప్తమయెడ్వర్డు ♦ సార్వభౌముఁడు, బహు
సంప్రీతి రాయబే♦హ్యాటికాఖ్య,
బరగుసాహైటిలోఁ ♦ బ్రవిదెందుగానుండి
మిందియాన్నృపతి ర♦చించినట్టి,
శాకుంతలాది భా♦స్వన్నాటకత్రయ
వ్యాఖ్యానములఁ గాంచి ♦ యాత్మనధిక
సమ్మదమ్మునంది, యుమ్మహా పండితు
నా కవీంద్రచంద్రు, సమ్మహేంద్రు,
దన సొసైటీయందుఁ ♦ దగ నొక్కమెంబరు
గా నొనర్చి ముగులఁ ♦ గౌరవించె.

వ. వినయోద్యద్గుణుఁడై, యుదారమతియై, ♦ విద్వాంసుఁడై, రాజభ
క్తినిరూఢుఁడయియున్న యా నృపతి సద్రీతిం బ్రశంసించి, ర
క్తిని విక్టోరియచక్రవర్తిని యొసంగెన్ ♦ యోగ్యతా పత్రముం
దన యౌదార్య జనానురాగగతులం ♦ ధాత్రీజనుల్ మెచ్చఁగన్. 161

క. శుభవృత్తినొసఁగె సజ్జన, విభుఁ డఖిలాగ్రముల సుకవి ♦ వినగమునను స
ద్విభవంబెలర్ప సజ్జను, లభినవభోజుఁడని సతత ♦ మభివర్ణింపన్. 162

గీ. సంతసమునఁజల్లి ♦ సన్యాసమాంబిక
పేరఁ గవిటుభద్రఁ ♦ బెద్దచెఱువు
నొప్పశోట యొకటి ♦ యొప్పవిరాజఁగఁ బ్రతి
ష్ఠించి మహితకీర్తి ♦ నించె జగతి. 163

సీ. రహిన గ్రమహిషి పేర ♦ రచించె విధ
వాప్తి నలరు లక్ష్మీనరసయ్యపేటఁ,
శ్రీతిరుకండవభాగ్యపేర నిర్మించె సు
శ్రీయుంచు రాజ్యలక్ష్మీపురంబు,
దనపేర గావించె ♦ వనను మృత్యుంజయ
నిశ్శంకపురమును ♦ నిరుపమాగ్ర
హారంబు, నాటించె ♦ వనముకును ఫలవా
టీకూప వరసరోవ్రాతము, సలఘు,
శుక పిక మయూర మధుకర నికరమధుర
పృథు రవాంచితమును నై హంవేలియను శు
భాహ్వయంబునఁ దనరు నుద్యానమొందు,
రమ్యగుణపాళి, మృత్యుంజయేంద్రాజమౌళి. 164

క. శ్రీమంతుఁ డమ్మహీపతి, ధీమంతుం డయూరిఃపుని నుతింపను మేలుగన్
శ్రీమార్కండేయేశ్వరు, నేమమునఁ బ్రతిష్ఠచేసి ♦ నిజనగరమునన్. 165

సీ. ప్రజలఁ బుత్రులఁబోలె ♦ బహుళసంప్రీతిఁ భా
వించినాఁ డరుఁ దూలించినాఁడు,
నిత్యసత్యవ్రత ♦ నియతిన్మై వసుమతి
నేలినాఁ డార్తిఁ బోఁ దోలినాఁడు.

సరసుఁడు సద్వృత్తి • సద్యశస్సంపత్తిఁ
బూనినాఁ డౌదార్య • మూనినాఁడు,
నుతి సేయఁదగిన యౌన్నతి వైభవములఁ గ
డించినాఁ డురుప్రజ్ఞ • మించినాఁడు,
ధరణిగ! యిటువంటి భామణి • పాలుఁడైనట
నైనఁ గలఁడే యటంచు ఘన • నామురాఁగ
సహితులై యార్యవరులెల్ల • సన్నుతింప
నలరె సన్మతి మృత్యుంజ • యావనిపతి. 166

క. ఆరాజమౌళి కాంచెను, హీరమణీదేవియందు • నేగురు సుతులన్
జారుతనూజల నిర్వుర, నాయూథప్రమదమాత్మ • నలరారంగన్. 167

మ. పరమ శ్రీకరు లక్కమాంబలలోఁ • బ్రాజ్ఞస్తుత్యోద్యద్గుణో
త్కర కాంతుండగు చంద్రశేఖర మహీ • కాంతుండు నిత్యస్ఫుర
ద్వరశీలుండు ప్రతాపరుద్ర ధరణీ • పాలుండు ధీరుండు శం
కరనిశ్శంకులు వెంకయాం బ్రబలి వేంకన్ మించి రంచద్గతిన్. 168

ఉ. వారలలోన నగ్రజుఁడు • వారితభూరిపరాక్రమక్రమో
దారుఁడు చంద్రశేఖర ధరాధిపవర్యుఁ డెసంగె భూరి భూ
భారధురంధర ప్రకట • భవ్యభుజాయుగుఁ డంచు నెల్లరన్
వారక సన్నుతింపఁ బిత్రు • భక్తిపరాయణుఁడై జగంబునన్.

శా. విద్వద్వర్యులు శాపురే యనుచు నెవ్వే • ళన్నుతుల్ సేయ సం
పద్విద్యా సువివేక సంపదల సం • పాదించి సమ్యగ్గతిన్
సద్వ్యాపార విధంబునం గవుల సం • తోషంబు గల్గించుచున్
పృథ్వీనాథకుమారమౌళి కర మొ • ప్పెన్ భూరి ధీయుక్తుఁడై. 170

క. అవిరళ కళాసమన్వితు,
వినయాదిక సహితుఁ జ్యేష్ఠ • నందనుఁ గని స
త్కవి నుతుఁడు మృత్యుజిద్భూ
ధవుఁ డెంతయు సంతసం బొందం జెంది, తగన్. 171

గీ. ప్రకటచికటిరాట్కుల • ప్రభువు సుస్వ
భావు శ్రీవేంకటేశ్వర • దేవుతనయ

వార్యనుత రాజ్యలక్ష్మీ సమాఖ్యఁ దత్కు-
మారునకు దేవిఁ గాఁ జేసె • మహితరీతి. 172

గీ. తీవి శ్రీచంద్రశేఖర • భూవరుండు,
పరమసాధ్వీలసన్మతి • భవ్యచరిత
రాజ్యలక్ష్మీ వనూమణి • రమ్యలీల
గూడి వేడుకనుండి బాల్యార్తి మొగయ 173

గీ. ముందుగ సుధీజనస్తుతా • మందసుగుణ
బృందముఖుని విజితాగ విం • దంబు మగఁ
డాపసిత మిఁకవ సత్యాంత • విమల చరితఁ
బ్రికట శుభగాత్రి నొక సుపుత్రికను గాంచె. 174

వ. తదనంతరంబున.

## శ్రీరాజా విశ్వేశ్వర నిశ్శంకమహీంద్ర చంద్రుఁడు.

గీ. పరవిఁ జిత్రిభాను • సంవత్సరాషాఢ
మాస శుద్ధసప్తమీ • మంగళాఖ్య
వాసరమున నిన్ను • భాసురగతి గాంచె
భవ్యశీల విశ్వప • మహీపాల. 176

క. అనఘా! నీ వుదయించిన,
వెనుకన్యక చాబ్జపత్ర • వీక్షణలౌ శో
భనతర గాత్రల నిద్దఱఁ
గనయలఁ గనె నాత్మ సతి ముదం బలరారన్. 177

గీ. నీవు ప్రభవించినంతనె • నీ పితామ,
హుండు మృత్యుంజయసూరిరాయుండు జనకుఁ
డురయశుఁడు చంద్రశేఖర • నరవరుండు
నధికవార్ధాంబునిధి నోలలాడిరంత. 177

గీ. నీవు బాలచంద్రు•నిం బోలి దినదినం
బును వృద్ధిగాంచు•చును సమస్త
విద్యలభ్యసించి • వెలయుచుండఁగఁ జంద్ర
శేఖరుండు కీర్తి • శేషుఁ డయ్యె. 178

ఉ. అంతట నీ పితామహుఁ డు•దంచితశీలుఁడు మృత్యుజిన్మహీ
కాంతుఁడు చాలవంత మది • గాంచియు భూరి వివేకియుక్ సుధీ
మంతుఁడు గాన నవ్వెతను • మాని నిను న్నిరతంబు సమ్మదా
క్రాంతమనస్కుఁ డై కడు సు•ఖంబుగఁ బ్రోచుచునుండె నంతటన్. 179

సీ. రెండవయాత్మ జా•తుండు ప్రతాప రు
ద్రకు మారమణుండు ప్రాజ్ఞుఁ డయ్యె,
దైవ వశంబున • ధర్మతత్పరుఁ డైన
జనకునితోడ ద్వే•షంబునూని,
సంగమవలసరా•జ్యమునందు భాగంబు
నొందఁ గోరుచు నభి•యోగ మొందు,
సరగునఁ జేసె వై•శాఖపట్టణపు కో
ర్టున నంత మృత్యుజి•న్మనుజపతియుఁ
దేవరాజా వేంకటరాయ • ధీరుఁ జెన్న
పట్టణాదిస్థలములకుఁ •బంపి తనకుఁ
జయముఁ గూర్చు సాధనముల • సంగ్రహించి,
సద్గతినివానిఁ దన్న్యాయ • సభకుఁ జేర్చె. 180

సీ. అంత తన్న్యాయ స•భాధీశ్వరుండు ధీ
రుఁడు కమింగాస్కో•యుదార సావ
ధానమనస్కుఁ డై • దావా విచారించి,
యేతదుజ్వల రాజ్యమె•ప్పుడు నవి
భాజ్యమే గాని వి•భాగార్హమావంత
యైనఁ గాదని న్యాయ•మలరఁ దీర్పుఁ
దగ వ్రాసి చదువఁ బ్ర•తాపరుద్రవిభుండు
చలురఁ డై జనకుని సరసఁ జేరి,

యమలమతి మత్కృపావరాం•భమున క్షమింపు,
మేము దాయాదులము గాము • మీరు కరుణ
నెచ్చు తాఁకి నిమాత్రమె • పుచ్చుకొనుచు
నుండెద మటంచు నమ్రుఁడై • యొలిఁ బలికె. 181

గీ. మరియు శాకితిన్నొక యుపం•బడికవ్రాసి
తగ సమర్పింప నృపతి మో•దమున నలని,
కలని తమ్మునయను భవ్య•గతిని గొన్ని,
భూముల నొసంగి సంప్రీతిఁ • బ్రోచె నంత. 182

పంచచామరము.

సరోజనేత్రలెల్లఁ గాంచి • చాల సంతసించి బా
పురే! యితండు చంద్రుఁడో సు•పుష్పబాణుఁడో సురే
శ్వరాత్మజుండొ యంచు రాగ • సంపదన్ నుతింప నా
నరేంద్ర యొప్పితీవు యా • వనం బెసంగ నత్తఱిన్. 183

సీ. శ్రీమచ్చరిత్ర, రా•జీవసన్నిభనేత్ర,
సుకవి నికాయ సం•స్తోత్రపాత్ర,
నాశ్రితావనలోల • నమల సద్గుణజాల,
ససద్వృత్తశీల, కృ•పాలవాల,
సతత పరిపూత, భా•స్వత్కళాసముపేత,
ముదితబంధువ్రాత • విదితగీత,
సాధ్వీలలామ బ్రాం•చ ద్వక్త్ర జితసోమ,
సురుచిధికృతహోమ •, సుకృతసీమ,
మధురవాణి, మహితపాణి, • మధుపవేణి,
మదనమోహన రూపుఁ•మార్కి గనక
మంజరీదేవి నిశి సం•మంజ సగతిఁ,
బెండ్లి కావించె నీవు సం•ప్రీతి మెరయ. 184

క. అపుడ మనోజ్ఞరూప క, లిసతియై యురుకలాధ•రీత సద్భా
వసతియై, ఘనసంప, త్ప్రీసతియై నిన్నుఁ గొలువఁ • జిత్తం బలరన్. 185

మ. జగతీభారములీలఁ దాల్చి ప్రజలన్ • సంప్రీతిమై నేలఁగాఁ
దగు సామర్థ్యము నీకుఁ గల్గఁగని యు•ద్యద్వైభవిన్ వృద్ధుఁడై

జ్ఞాదీశుండు జగాన్వితుండనగుట రా♦జ్యంబెల్ల నీకిచ్చి భ
వ్యారతిం జెందె సుకీర్తిశేషుండయి భా♦స్వన్మూర్తి లక్ష్మసతిన్. 186

క. ఈరీతి నిజపితామహు,చే రహి నర్పింపఁబడిన ♦ స్థిరరాజ్యరమన్
ధీరత వహింపఁ దలఁచి సు, ధీరమ్యు లమాత్యముఖులు ♦ ధీరులుగొలువన్

క. సరసగతిఁ గ్రోధిసంవ, త్సర ఫాల్గునమాస శుద్ధ♦దశమీ గురువా
సరమునఁ గాంచితి వతి భా, స్వరతర పట్టాభిషేక ♦ సంపత్తిబలే. 188

మ. ఫలియించెన్ బుధు లెన్న నీ విటులఁ ద♦త్పట్టాభిషేకోత్సవో
జ్జ్వలసంపత్తి వహించి యిన్వసుమతీ ♦ భారంబు భాస్వద్భుజా
స్థలి లీలన్ ధరియించి నిచ్చలు మహా♦ సంప్రీతిఁ బాలింపుమం
డ లలిం జెందుచునుండి రెల్ల జనులా♦నందంబు డెందంబులన్. 189

మ. తొలి నానావిషమాచలాగ్రముల నెం♦తో సుస్థిక్కి యావెన్క ని
స్తులకూర్మాసన యోగవైఖరి మహా♦శుంభత్తపం బూని ని
శ్చలసద్భక్తి ననంతునిం గొలిచి యి♦చ్చం ధారుణీకాంత ని
స్తులమిం జెంది సుఖించుచుండె భళి వి♦శ్వైకక్షితీశాగ్రణీ. 190

సీ. వెలిఁగించె నెవ్వాఁడు ♦ విబుధాళి వినుతింప
వర మేదినీరావు ♦ వంశ మవనిఁ
బ్రభవించె నెవ్వాఁడు ♦ పరగ నీ మేనత్త
యల యిందుమతి గర్భ ♦ కలశ జలధిఁ,
జేపట్టె నెవ్వాఁడు ♦ చెలఁగి నీ యగ్రజ
పద్మాల యాసతి♦పాణి నెలమి,
ధరియించె నెవ్వాఁడు ♦ దాన దయాధర్మ
భాసురతర గుణా♦భరణ వితతి,
నతఁడు మతిమంతుఁ డతి శాంతుఁ డమల యశుఁడు,
విజయలక్ష్మీ నృసింహ ప్రభుం♦డు విభుఁడు నీతి
ప్రాభవస్ఫూర్తియి సురాజ్య♦కార్యగతుల
నీకు సహాయ్య మొసఁగుచుం♦టిది మహీంద్ర! 191

పంచపాదిసీసము.

దత్తపుత్త్ర్యజుఁడు సన్మతి కృష్ణరాయాఖ్య, ధీరాగ్రణి సిరస్తదారు గాఁగ,
మేధాయుతుఁడు విశ్వనాథాహ్వయుఁడు నీతివిదుఁడు జవాబునవీసు గాఁగ,
సురుచిర నేమాన సూర్యప్రకాశాఖ్య, కవిమణి కోశాధికారి గాఁగ,
ప్రశాంత సద్గుణాంబు గుంపస్వామినామక, ప్రముఖులు లేఖకోత్తములు గాఁగ,
సంస్కృతాంధ్రాది భాషాతి సాహితీ సు
ఘన సంపత్సహితులు ప్రకాశశాస్త్రి
ముఖ్యులాస్థాన సుకవి ప్రముఖులు గాఁగ,
నేలుచుంటివి జగతి విశ్వేశ్వర నృపతి. 192

సీ. ఘనదాన కలనశంకరునంతటి వదాన్యుఁ
డైశ్వర్య లీలల నంతవాఁడు,
సత్యంబునను హరిశ్చంద్రునంతటి ధీరుఁ
డవిరళ శివభక్తి నంతవాఁడు,
సద్బుద్ధి నిర్జరాచార్యునంతటి ప్రాజ్ఞుఁ
డతినీతి చతురత నంతవాఁడు,
సాంద్రకీర్తిని పూర్ణచంద్రునంతటి రమ్యుఁ
డాకార వైఖరి నంతవాఁడు,
బాపురే! యివ్వసుంధరా పాలుఁ డనుచు,
వరసుధామయ వాగ్వైభవం బెలర్ప,
సంతతము సత్కవులు నిన్ను సన్నుతింతురు,
రక్షితకృతీంద్ర విశ్వేశ్వర క్షితీంద్ర. 193

చ. తగ నిజరాజధానియయి తద్దయు నొప్పుచునుండు మృత్యుజి
న్నగరమునందు సజ్జనగణంబు భళీ యనఁ జంద్రశేఖరు
న్నగ తనమావరు శ్రితజనక్రియయు నెంతయు భక్తినెమ్మది
న్నెగడ ప్రతిష్ఠజేసితివి నిస్తులరీతి క్షితీశ్వరాగ్రణీ! 194

సీ. నాటించితివిచాల నానాటసాలాభి
రామంబులైన యారామతతులఁ,
ద్రవ్వించితివి సముద్యత్సుధాసదృశాంబు
[illegible]

గావించితివి బుధా ♦ గ్రణులు మెచ్చ నుదార
గరిమ మహీదేవ ♦ పరిణయములఁ;
నొసంగితి వతిమోదము మెసఁగ ♦ భూసురులకు
మహితమాన్య క్షేత్ర ♦ మండలములఁ,
జేసితివి పెక్కుసార్లు త ♦ త్స్తోత్రమందు,
శ్రీజగన్నాథపాద రా ♦ జీవ సేవ,
భళిర! వినుతింపశమె నీ ♦ భవ్య చరిత,
మమలగుణసాంద్ర విశ్వేశ్వ ♦ రావనీంద్ర! 951

సీ. చెలఁగి నీ సన్నిధిఁ ♦ జేరి, నీ వలన స
న్మానింపఁ బడనిప ♦ ద్మజుండు,
నెలమి నీ చెంతకు ♦ నేతెంచి నీదు స
త్కారంబు జెందని ♦ కవి వరుండు,
సొనర నీదరిజేరి త ♦ న ప్రౌఢిమము నూపి
గౌరవం బందని ♦ గాయకుండు,
సరవి నిన్ భజియించి ♦ సంతతంబును కామి
తార్థంబులొందని యా ♦ ర్థిజనుఁడు,
జలధిపరివేష్టితావనీ ♦ స్థలమునందు,
గడఁగి వెతకిన నొకఁడైనఁ ♦ గానబడఁడు,
భళిర! యేమనవచ్చు నీ ♦ ప్రకటదాన
మహిమ విశ్వేశ్వర నృపాలమహిత శీల. 196

మ. కలలోనైన నసత్యమాడవు మదిన్ ♦ గర్వింప వేనాఁడు నఁ
జ్ఞులనెన్నండును జేరదీయవు విప ♦ త్కుం డైన రక్షింపు మ
న్నలలిం బోత్రువుగాని నేరముల నె ♦ న్నం జూడవయ్యారె! నీ
కిలలో నెవ్వరు సాటిరాఁగలరు విశ్వే ♦ శక్షమావల్లభా! 197

సీ. రంగ దుత్తుంగత ♦ రంగ ప్రసంగ గం
గాఫేనిలములతోఁ ♦ గలసి మెలసి,
కుంభదంభోజాత ♦ సంభవ స్త్రీరుచ
కుంభహారములతో ♦ గొండ్లిసలిపి,

బృందారకాధీశ ♦ నందనమందార
　　　　పుష్పబృందములతోఁ ♦ బోఁదొనర్చి
చంచచ్ఛృగత్కాల ♦ సంపూర్ణిమాచంద్రి
　　　　సాంద్రచంద్రికలతో ♦ సరసమాడి,
కలితగతిఁ ద్వాదశాబ్దమ్ము లో♦కమ్ములెల్ల
నిమ్మగాఁ గ్రిమ్మకొని యస♦మమ్మె సంగు
చుండె ఖ్యాతినైచి వీరమ♦హోగ్రిసార
నిరుపమౌదార్య విశ్వేశ ♦ నృపతివర్య! 198

సీ. గురుతరుశీమణీ ♦ హరణ మహాదోష
　　　　సహితుండు గాఁడేని ♦ శశధరుండు,
కుపితపురారాతి ♦ ఘోరనేత్రానల
　　　　దగ్ధుండు గాఁడేని ♦ దర్పకుండు,
బహు భయంకరవీర ♦ భిదిరిపాదాహతిఁ గని
　　　　కందఁడేని యం♦కర్కమల హితుఁడు,
ఇక్ష్వాకువంశజ ♦ పరిక్ష్వేడనాగ్నిలో
　　　　షితుఁడు గాఁడేని యా ♦ సింధురాజు,
ఘనయశంబున నా♦కారమునఁ బరితాప
[illegible]న గాంభీర్యమున నీకుఁ ♦ దుల యనంగఁ,
దగుదురని పల్కుదురు బుధుల్ ♦ ధరణి నార
భూరిగుణజాల, విశ్వేశ ♦ భూమిపాల. 199

క. దానము, లోకానుభవ, జ్ఞానము, మృదుభాషణముల ♦ సన్మంత్రాను
ష్ఠానము, నాశ్రితజన స, న్మానము, మనుచేంచరి, నీస ♦ నైజ గుణంబుల్.

సీ. భూమి విశ్వావసు ♦ నామవత్సర భాద్రి
　　　　పదమాసమే పక ♦ పక్ష నవమి,
నంబుజాప్తజ వాసరంబున శుభలగ్న
　　　　మందాగ్య బృంద♦మానంద మొంద,
వాలమి [illegible]
　　　　గరి[illegible] విలస[illegible]

సన్మార్గశీర్షమాస వినీలపక్ష సు
ద్వాదశీ సురగురు•వాసరమున,
రమ్యలగ్నమందు • రాజేశ్వరాఖ్య ద్వి
తీయపుత్త్రిగాంచి•తివి మనోజ్ఞ
రీతి గనకమంజ•రీ సుందరీభవ్య
గర్భశుక్తిమహా•క్తికంబు లనఁగ. 201

క. నీసుతులు రూప మారమ, ణీసుతులు, నితాంతబలమ•నీషా శర్వా
ణీసుతులు, వెలయుచుండిరి, భాసురగతిసత్కళావి•భవయుతు లగుచున్.

గీ. అనఘ, యిప్పటికియ్యుర్వ•రాత్మజులు స
మంచిత గుణాస్పదులు జని•యించి రికను,
పల్వురు తనూభవులు తనూ•భవలు నీకు,
గలిఁగి వర్ధిల్లఁ గలరుర్విఁ • గలితగతుల. 203

సీ. ధరణీశ నీ పిన•తండ్రి పరితాప రు, ద్రావనీపతి సద్గుణా•ఢ్యుఁ డగుచు,
శ్రీపెదభీమయార•సింహుని రామచం, ద్రాధిప తనయఁ గృ•ష్ణాభిధేయ,
బత్నిగా జెంది యా • భామినీమణియందు, నెలమి మైత్రి వేంక•టేశ్వరాహ్వ
యుని సోమశేఖరా•ఖ్యుని ప్రభాకరనాము, చంద్రచూడామణి•సదభిధాను
రాజచూడామణి సమాఖ్యు • రమ్యలీల
నేవురు కుమారులం గని • యా వధూటి
స్వర్గపద మొందినంత నా•సతికి సహజ
యైన హైమవతిం బెండ్లి• యాడి ప్రీతి. 204

సీ. అఖిలసౌఖ్యంబుల • నందుచు నా సతి
యుం దిప్పటికి నొక • యాత్మజాత,
బడసినాఁ డీపయిఁ బల్వురు పుత్త్రులఁ
బుత్త్రికామణులనుఁ బొందఁ గలఁడు,
తజ్జ్యేష్ఠ తనయుండు • దారుండు శ్రీవేంక
టేశ్వర నిశ్శంకుఁ • డెలమి మీర,
లలిత మేదినీరావు • లక్ష్మీపతిక్షితీ
శ్వరపుత్త్రి నిందిరా • సతిని పెండ్లి,
యాడి యా సుందరీమణి • యందు మోద,

## పృథ్వీవృత్తము.

శ్రితావన కళాధరా విమల ♦ శీల లీలావతీ,
శతాగశర సద్యశోభరిత ♦ సర్వ సర్వం సహా
వితీర్ణ జితకర్ణ ధీరవర ♦ వీర ! విశ్వేశ్వర
క్షితీశ్వర ! శుభాకరా ! సుకవి ♦ శేఖర ! శ్రీకరా !

గీ. వరపరీధావి వత్సరా ♦ శ్వయుజశుద్ధ
పూర్ణిమా స్థిరవాసరం ♦ బున రచించె,
మహితగతి నీ చరిత్ర నే ♦ మాన కులుఁడు,
సుమతి సూర్యప్రకాశాఖ్య ♦ సుకవి జగతి.

## గద్యము.

ఇది శ్రీమద్వాణీ రమణీమణీ కరుణారస సంవర్ధిత, సరస
కవితా సమంచిత, నేమాన కుల కలశార్ణవ, పూర్ణిమా
హిమధామ, శ్రీకుమారరలాము, రామేశ్వర నా
మతనయ, సుధీజనవిధేయ, సూర్యప్రకా
శనామధేయువిరచితంబగు శ్రీ
మన్నిశ్శంక చరిత్రంబు
సర్వంబు
నేకాశ్వాసము
సంపూర్ణము
స్వస్త్యస్తు
శ్రీ

